# అభినవసరస్వతి

| సంపు 5 | జానపాడు<br>ప్రమాదీచ సం॥ జ్యేష్ఠమాసము. | సంచి 6 |
|---|---|---|

## గ్రంథస్వీకారము.

తాళపత్రకనము, శృంఖల, మత్తయిసువార్త, మాకార్యస్థాన మలంకరించియున్నయవి వీనిపైమాయభిప్రాయము ముందు నెలలోఁ దెలుపఁబడును.

## కృతివిమర్శనము.

చాటుపద్యమణిమంజరి—ఇది ప్రాచీనకవులగు ననేకులు తత్తత్ప్రస్తావములలోఁ జెప్పినచాటుపద్యములు చాల నొకచోఁ జేర్చిముద్రింపఁబడినయొకపుస్తకము. అందువలననే పద్యములతిరసవంతములై కన్పట్టెడు-ఏతద్గ్రంథసంపాదకులు ప్రసిద్ధులగు బ్రహ్మశ్రీ॥ తిరుపతివెంకటేశ్వరకవులకు శిష్యులై చెన్నపురపు లిఖితపుస్తకభాండాగారమునఁ బండితులైయున్న బ్రా॥శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు- దీనివెల 1-0-0 వలయువారు "మణిమంజరి మేనేజరుగారికి- తిరువల్లిక్కేణి, మద్రాసు" అని వ్రాసికొనవలెను- మాదిరిచూపుటకై యిందలిపద్యములు రెండీదిగువనుదహరింపఁబడుచున్నవి.

క॥ చిక్కాలుబొక్కాలు వెదకును, నక్కాలతో నూరఁబంది యగడీత వెతకున్
గుక్కాలు చెప్పులు వెదకును, దక్కాడనాలంకకొడుకు తప్పే వెదకున్

సీ॥ పాలుపొందఁగ విభూతిబొట్టు నెన్నొసలిపైఁ, దళుకొత్తు చెమటచుక్కలపడంగ
సొగసుగాఁ బూదండజోఁపినకీల్గొప్పు, జాఱఁగా నొకచేత సరుదకొనుచు
బిగిచన్నుఁగవమీఁద బిరుసుఁబయ్యెద చెంగు, గిగజాఱి శివసూత్రముగ పడంగ
ముక్కున హురుమంజిముత్యాలముంగర, కమ్మవాతెఱమీఁద గంతులిడఁగ
తే॥ కొనుజవ్వాడ మట్టియల్ గదిసిమ్రోయఁ, గమ్మవిలుకాని జాళువాబొమ్మయనఁగ
మెల్లమెల్లన సింహాద్రిమీఁదికేగెఁ, గన్నెపూఁబోఁడి యగసాలివన్నెలాడి

(శ్రీనాథ ుఁడు)

ఇట్టి యమూల్యములగుపద్యము లింకనేకములు

బహూకృతి.

ఈపత్రికయం దిదివఱకు ప్రకటితములైన గ్రంథములలో "వీరభాగవత"మనునదియొకటి-ఈకృతిపతి కీర్తిశేషుఁడగు "సుంకర వుల్లయ్య" నతఁడు ఆతని తనూజులగు శ్రీజగన్నాయకులు రంగనాయకులు మొదలగువారుతమపేరులుకూడ నాచేఁ దమవంశానువర్ణనమునఁ జేర్పించికొని స్వగ్రామమగు నందిగామునకుఁ బిలిపించి **2-6-1913** వ తేది నూటపదియాఱులు బహుమతిచేసిరి. ఆసమయమున నీక్రిందిపద్యములు నాచేఁ జదువఁబడినవి.

సీ॥ వీరులకథ యచ్చు వేయించుటాలించి యాసక్తి నను బిల్వనంపినారు
భక్తివిశ్వాసముల్ బాగుగాఁ జూపించి చేసెడిపనికి హర్షించినారు
గ్రంథపూర్తిని జేసి కైకొనిరమ్మంచుఁ బ్రీతిమై నన్నుఁ బ్రార్థించినారు
పూర్తిగా నదియొక్క భూసురముఖమునన్ వాసిమై శ్రవణంబుచేసినారు
గీ॥ భూరిసంతర్పణముచేసిభూమిసురులఁ, దనిపి బహుమతిసలిపి నన్ననిపినారు
ఔర! సుంకరవంశాబ్ధిశూరులైన యీజగన్నాయకాదుల నెన్నఁదరమె॥
ఉ॥ కరణము గ్రామమున్నిభమున క్ష్మాసురు లూరుజు లంఘ్రిజాదులున్
విరివిగఁ గూడియున్న సభ వేడుకతోడ బహూకరించి నన్
…గము ప్రమోదసంభరితుఁ గా నొనరించినయట్టివీరశై
జరిపెద దీవనంబులను జాల యశోధనులై చెలంగఁగన్॥
యాతండ్రికిఁ గృతియిచ్చిన యాతం డావీరభద్రయాహ్వయుఁ డరయన్
…తిని విరాకుఁ గృతియిడిన, యాతండను నేనుసూ యథార్థము గాఁగన్॥
…వున నన్ను సత్కృతుని గానొనరించితి రయ్యొసంతసం
…యాన్వి…తుల్! వినుఁడీఁకొకట్టి, నేఁ బ్రచురించుపత్రికన్
గావలెనంచు శ్రద్ధమెయిఁ గైకొనుడన్ మఱి రౌప్యపంచకం
…వలెనీ గ్రహీతుల ము, యియ్యదియే యొకవార్షికంబుగాన్॥

## శ్రీమనోరంజనీ పత్రికాధిపతిగారికి.

అయ్యా!

తమరు తమ మనోరంజనీనామకపత్రికలో గోదావరీమండలసభ యను శీర్షికక్రింద గొన్నిసభలవృత్తాంతముల దెలియబరచుచు మూడ వనాటి యుదయము పూర్వాచారసభజరిగెను. దానికి దివానుబహాద్దర్ దురిసేటి శేషగిరిరావు పంతులు బి. ఎ. బి. ఎల్. గారగ్రాసనాధిపతులుగానుండిరి. దానియందు శ్రీకప్పగంతు రామశాస్త్రిలు మొదలగువారేడుగురు మాట్లాడిరని వ్రాయుచున్నారు. కాని యిదివరకే తమపట్టణమందె ప్రచురింపబడు "రవి" యను పత్రికలో నొకలేఖనుగాంచితిని. అదియే తత్సభావిషయములుగలదని యెఱుగుడు. ఆలేఖను జక్కగా జదివితిని. తమవ్యాసభాగమును జదివితిని ఈరెంటినిజూడ మీవ్యాసమసత్యవచనపూరితమై పూర్వాపరసందర్భవిహీనమై విరాజిల్లుచున్నది. మీవ్యాసముజూడ, సుజనమనోభిరామమును, పండితోద్దండమండితంబును, సన్మార్గదర్శకంబును నగునాహిందూమత మహాజనసభజరుగుట మీకిష్టములేకపోవుటయకాక కష్టముగూడ నున్నట్లు బోధపడుచున్నది. మీకు గష్టముగానున్నను యొకదానివిషయమై వ్రాయదలచినపుడు సత్యమున్వ్రాయవలెను. అటులవ్రాయక యసూయచే ననృతములవ్రాయువారు విశేషదూషణీయులుగదా. మీరా సభాధిపులు నిర్ణయించుకొనిన "హిందూమతమహాజనసభ" యను నామమును దీసిపారవైచి స్వతంత్రమవలంబించి "పూర్వాచారసభ" యను క్రొత్తపేరునుబెట్టివ్రాసితిరి. ఇటులవ్రాయుట దానియందుండు నసహ్యముచేతనెగదా. కాదనెదరా? సంఘసంస్కరణసభ, రాజకీయ సభ, యని యాసభాధిపతులు నిర్ణయించుకొనిన పేరులనేల దీసిపారవైచి యభినవనామమునొకటి పెట్టివ్రాయకపోతిరి? వారు నిర్ణయిం

చుకొనిన యానామములనె శీర్షికలగానుంచుకొని ప్రీతిపూర్వకవచనముల వ్రాయుచువచ్చితిరి. ఇటుల వ్రాయుటకుగారణమేమి? కారణమేమియులేదు. కాని తమకు సంఘసంస్కరణాదిసభలయందుండు ప్రేమవలన నిటులమంచిగా వ్రాసితిరనియు, నాహిందూమతమహాజనసభయందుండు ద్వేషముచేత నటుల వ్రాసితిరనియు ననికారణములుగా గ్రహింపవలసివచ్చినది. పోనీ, మీరు హిందూమతమహాజనసభ యన్నను పూర్వాచారసభయన్నను యొకయర్థమునిచ్చునవని తలచి వ్రాసితిరని యనుకొందునా? అటుల దానికి నర్థమువచ్చుటలేదుకదా. అయినను నాయభిప్రాయమంతియకాని వేఱుకాదనెదరా? అటులైననా హిందూమత మహాజనసభయందు జక్కనియుపన్యాసము లొసంగిన బ్ర॥శ్రీ॥ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులు, శ్రీనాళము పద్మనాభము,బి.ఎ. బ్ర॥ వంకా వేంకటరత్నశాస్త్రులు, కా॥ సుబ్బయ్యశాస్త్రులు, శ్రీ దర్భా వెంకయ్య పంతులు బి.ఎ. బి. ఎల్. మొదలగు ప్రముఖులయొక్క నామధేయముల నేల ప్రకటించలేదు? చక్కనియుపన్యాసముల గావించిరనుదానికి మాఱుగా నసూయచే “రామశాస్త్రులు మొదలగువారేడుగురు మాట్లాడిరని వ్రాయుచుంటిరే? ఇది పక్షపాతముగాదా? సంఘసంస్కరణాది సభలందుపన్యాసములొసంగినవారిలో నొకరినైనను విడిచిపెట్టక యందఱినామములను బిరుదములతోగూడ ప్రకటించుటయేల? ఈసభోపన్యాసకుల పేరులన్నియు ప్రకటించక రెండుపేరులమాత్రమె ప్రచురించుటయేల? కారణము పక్షపాతమె. అయినను హిందూమతమహా జనసభాగ్రాసనాధిపతుల నెటులనో ధర్మస్వరూపులని వ్రాసినందుకు సంతోషమగుచున్నది. ఇప్పటికైనను యీహిందూమతమహాజనసభోపన్యాసకసభ్యులు ధర్మముగలవారగుటబట్టియె ధర్మస్వరూపులగువారగ్రాసనాధిపత్యము వహించిరని తెలుసుకొనుడు. నేటికి

హిందూమతమహాజనసభ యనుదానినొకటి నెలకొల్పి దురాచారముల నిర్మూలనము జేయసమకట్టిన యీసభ్యులకు మనము వందనముల నర్పించవలసియున్నాము. కాబట్టి యసూయాభావమువిడనాడి పెద్దవారల సేవించుడు. అనృతములను వ్రాయకుడు. మీకీవిషయముననె కాక పక్షపాతానిష్టము లితరవిషయములందుఁగూడ నున్నట్లు ప్రస్తుతమందు మీరువ్రాసిన వ్యాసమువలననె ద్యోతకమగుచున్నది. ప్రస్తుతానావశ్యకాధిక ప్రసంగము నొకదానిని దీసికొని విద్వత్కవివరులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వరులను దూషించుచు నెంతమాత్రము పాండిత్యములేని కొందఱవారిని భూషించుచు వ్రాయుచుంటిరి. ఈదూషణభూషణముల కసత్యములనె ప్రబలప్రమాణములుగా దీసికొని వ్రాయుచుంటిరి. ఇటుల నసత్యములను ప్రమాణములుగాదీసికొనివ్రాసి లోకమును మోసము జేయ మీరు ప్రయత్నించినపుడు గొప్పవారలను సాక్షులుగా జేసికొని సకారణముగ సత్యమునుదేల్చి జనులకుపకారమునరించిన శ్రీ యార్యమతబోధినీ పత్రికామతల్లికి. తేజోవిహీనమైనదా? నిశ్చయము నుత్తరములద్వారా తెలియపరచినవారలు, లౌకలూకాయలా? ఇటుల వ్రాయుట మీకు దగునా? వివేకులుమెచ్చెదరా? శ్రీతిరుపతి వేంకటేశ్వరాధునిక కవీశ్వరులను స్వశాఖాభిమానమూని దూషించెదరా? పక్షపాతమవలంబించి హిందూమతమహాజనసభావిషయము వ్రాయుచుంటిరా? కానిండు. మీకిట్టివిపరీతబుద్ధి యెందులకు వచ్చినదో తెలియరాదు. కాన నికనైన నీబుద్ధివిడచి మంచిబుద్ధిని జేకొనవలయునని కోరెదను.

సికింద్రాబాదు
21—4—1913

చిఫుకుల అప్పయ్యశాస్త్రి,
నైజాం గవర్నమెంటు హైస్కూలు తెలుగుపండితుడు.

## అవధానములు.

(చేతపూడి. భగవంతరావుగారు.)

1912 సం॥ డిసెంబరు 28 తేదీగల కృష్ణాపత్రికయందు బ్రహ్మశ్రీ అక్కిరాజు ఉమాకాంతము పంతులుగారు అవధానములు అను శీర్షికతోఁ బ్రచురించిన వ్యాసమును జూచినాఁడను. ఆనెల 16 వ తేదీయందు వీరు చెన్నపురి పచ్చయ్యప్పకాలేజిలో అవధానములనుగూర్చి యుపన్యసింపఁగా నాఁడు సభాధ్యక్షులుగ నుండిన బ్రహ్మశ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిపంతులుగారు వీరి యభిప్రాయములకుఁ బ్రతికూలముగ నేమో వచించిరని వారి వాక్యముల ఖండించుచు వీరి యుపన్యాసమును గూడ సంగ్రహముగ వ్రాసిరి. వీరి యభిప్రాయములు మిక్కిలి యపూర్వములుగ నున్నవి. ఇందు వివాదాంశములు పెక్కులు కలవు. నాచే రచియింపఁబడి, ప్రకృతమున ముద్రణమందుండిన యుపన్యాసమంజరి యను గ్రంథమునందలి అవధానవిషయకోపన్యాసము నేయిటఁ బ్రచురించుట బహుకారణములచేత మేలనియెుఁ దోఁచుటచే దానినే యిట బ్రచురించుచున్నాఁడను.

శ్రీమదఖిల భువననిర్మాత యగు పరమేశ్వరునిచే సృజింపఁబడిన సమస్తచరాచరప్రపంచమునందును యుక్తాయుక్తవిచార జ్ఞానసంపన్నతచే మానవుఁ డుత్తముఁ డగుచున్నాఁడు. కార్యమువలనఁ గారణమును గ్రహించినట్లు సృష్టివలన స్రష్టయొక్క యభిప్రాయములను సాధ్యమగువఱకు గ్రహించి తదభిప్రాయానుకూలముగ లోకవృత్తముల నిర్వహించుటయందుఁ దాను దనప్రజ్ఞ నంతను వినియోగించుచున్నాఁడు. మఱియు నితర చరాచరముల నన్నిటిని దనకు సహాయముగఁ గొనుచు వానిని స్వేచ్ఛగఁ బ్రయోగించుచున్నాఁడు ఇతరజంతుజాలము నంతను దన ప్రజ్ఞచేత స్వాధీనముచేసికొని యాయాజంతువులు వానివాని విధులఁ గ్రమంబుగ నిర్వర్తించున ట్లొనరించుచున్నా

డు. ఈ కార్యములం దెల్లను మనుజునకుఁ బ్రజ్ఞ మహావశ్యకము.

అట్టి ప్రజ్ఞ రెండువిధములు సహజప్రజ్ఞ, సంపాదితప్రజ్ఞ. సహజప్రజ్ఞయం దీతని ప్రయత్న మేమియు లేదు అది మనుజునకును దదితరములకును గూడ వానివానికిఁ దగినట్లు లభించుచుండును. సంపాదితప్రజ్ఞయందే మనుజాధిక్య మంతయుఁ గలదు. ఈశ్వరుఁ డొసఁగిన దేహమనశ్శక్తుల రెంటిని సాధ్యమగునంతవఱ కభివృద్ధి నొనరించుటయే యీతని సంపాదితప్రజ్ఞ ఇట్టి ప్రజ్ఞనుగూర్చి ప్రతిమనుజుఁడును సాధ్యమగు ప్రయత్నముల నన్నిటిని జేయుచున్నాఁడు. ఈ ప్రయత్నములు త్రివిధములు:—ప్రజ్ఞాసంపాదకములు, ప్రజ్ఞాద్యోతకములు, ప్రజ్ఞాప్రయోజకములు. వివిధవిద్యలయందు విద్యార్థు లొనరించు ప్రయత్నములన్నియుఁ బ్రజ్ఞాసంపాదకములు, పాఠశాలలందలి సంవత్సరపరీక్షలు, గానసభలయందలి పల్లవిపాటలు, వ్యాయామవిద్యాసభలందలి బరువుల నెత్తుట మోయుట యినుపగొలుసులను ద్రెంచుట వనమృగంబులతోఁ గలియఁబడి పోరాడుట మొదలగు కార్యములు, కవిత్వసభలందలి యవధానములు—లోనగునవన్నియుఁ బ్రజ్ఞాద్యోతకములు వివిధవృత్తులం దుద్యోగములను సంపాదించి తన శక్తిని దేశసేవార్థముపయోగించుట, ఏ సాధారణమైనపాటనైనను వన్నెలువెట్టి బహుజనరంజకముగఁ బాడి యందలి భావమును శ్రోతలహృదయములందు నాటుకొనునట్లొనర్చుట, ఆపత్కాలములందును ఆవశ్యకసమయములందును బలహీనులు లోనగు బరువుల నెత్తికొనిపోవుట, స్వపరబంధములఁ ద్రెంచుట, శత్రువులతో సమర్థంబుగఁ బోరుట, దారసుతప్రసంగ గృహచ్ఛిద్రాది వివిధవిషయములు బహుభంగులఁ జిత్తము నాకర్షించుచుండినను దాను వాని నన్నిటిని సమర్థించుకొనుచు సంఘోపకారకరములగు గ్రంథములను వ్రాయుట—మొదలగునవి ప్రజ్ఞాప్రయోజకములు.

మానవప్రోత్కర్షమునకు సోపానత్రయ మనఁదగిన యీత్రివిధ ప్రయత్నములును స్వల్పకార్యములందుఁ బ్రతిమనుజుఁడు నొనరించుచు నేయుండును. ఘనకార్యములందు మాత్ర మట్లుకాదు. కొందఱు ప్రథమసోపానమందే నిలిచిపోదురు. అనఁగా విద్యాభ్యసన మొనరించిన వారిలోఁ గొందఱుమాత్రమే ప్రజ్ఞావంతు లగుదురు, మిగిలినవా రచటనే నిలిచిపోవుదురు. ప్రథమసోపానాధిష్ఠాతలలోఁ గొందఱు ద్వితీయసోపానమందు నిలచిపోవుదురు. అనఁగాఁ బ్రజ్ఞావంతులలోఁ బెక్కండ్రు తమ ప్రజ్ఞను సంఘోపయోగార్థ ముపయోగింపఁ జాలకయుందురు విద్యలం దసమానప్రజ్ఞాధురంధరులయ్యుఁ దమప్రజ్ఞచేత నూతన గ్రంథముల రచియించుటకుఁగాని, బోధించి మఱికొందఱను దమబోంట్లగా నొనరించుటకుఁగాని సమర్థత లేనివా రెందఱో సంఘమందు గనవచ్చుచుందురు. ఇఁక ద్వితీయసోపానమందలి వారిలోఁ గొందఱు తృతీయసోపానమునుగూడ నెక్కి తమప్రజ్ఞను బలువిధముల సంఘోపయోగార్థ ముపయోగింతురు.

ఇందుఁ బ్రథమసోపానమందలివా రాయావిద్యలం దించుక పరిచితిని మాత్రము సంపాదించుకొని దానిని స్వోపయోగార్థ ముపయోగించుకొనుచుందురు. కాని ద్వితీయతృతీయ సోపానరోహకులవలన సంఘమున కెప్పుడును మహోపకారము కలుగుచునేయుండును. ఎట్లనఁగా ద్వితీయసోపానమందలి వివిధప్రజ్ఞాధికులు తమ ప్రజ్ఞలను సభాముఖంబునఁ బ్రదర్శించునపుడు సభ్యులా ప్రజ్ఞల కద్భుతాశ్చర్యముల నొందుచుందురు. ఆ సభ్యులలోఁ బెక్కండ్రట్టి ప్రజ్ఞాసంపాదనమునకై ప్రయత్నించుచుందురు. వారినుండి వెలువడెడి ప్రజ్ఞాధికులలోఁ గొందఱు తృతీయసోపానాధిష్ఠాతలును నగుదురు దీనికిఁ గారణము ద్వితీయసోపానరోహకుల ప్రజ్ఞాప్రకటకార్యమే. తృతీయసోపానరోహకులు ప్రయోజనము నెల్లప్పుడుఁ జేయుచునేయుందురు. వీరిలో

గ్రిందిసోపానమందలి వారిని పై సోపానమునకుఁ బొమ్మనుట న్యాయ మేకాని పోవుటకు వారికి శక్తి చాలదు. అందఱును ఎం. యే. పరీక్షవఱకును జదువఁగలుగుట లేదు. ఈశ్వర ప్రేరితమైన సంకల్పబల మెంతవఱ కుండునో అంతవఱకు మాత్రమే పోవుదురు. పైకిఁ బోవకుండుటచేత వారు నిరసనార్హులు మాత్రము కారు. వారి ప్రజ్ఞ వ్యర్థమును గాదు వా రంతవఱకుఁ బూజనీయులే.

ఇట్టి త్రివిధప్రయత్నములలోఁ గవు లొనరించు నవధానములు రెండవమెట్టుపై నుండు వారికార్యములు. ఇవి సంఘమునకు మహోపకారము నొనరించును మనుజుఁడు తన సర్వప్రయత్నములందును బుద్ధిబలముచేతనే కార్యసిద్ధి నందుచున్నాఁడు. కొండంత యేనుఁగును గోరంతలో స్వాధీనము చేసికొనుచున్నాఁడు. పదిమంది కూలిజనులలో బుద్ధిబలముకలవాఁడు మేస్త్రీయగుచున్నాఁడు. వేయిమంది సైనికులలో బుద్ధిబలముకలవాఁడు సేనాధిపతి యగుచున్నాఁడు. పదివేలమందిలో నొకబుద్ధిశాలి మంత్రియగుచున్నాఁడు. ఇంతయేల? ప్రపంచమును బాలించునది మనుజుని బుద్ధిబలమేకాని మఱొక్కటికాదు. ఇట్టి బుద్ధిబలము నభివృద్ధిచేయునవి 'అవధానములు' ఇందు అవధానము, ధారణము, ఆశుకవిత్వము, నను మూఁడుభాగములు కలవు. అవధానమనఁగా నెచ్చరిక, జాగరూకత, ధారణమనఁగా వివిధవిషయముల బుద్ధియందు ధరించి నిలుపుట, ఆశుకవిత్వ మనఁగా నప్పటికప్పుడే పద్యములఁ గూర్చుట. ఇచ్చట నవధాయకుఁ డేకకాలమందు వివిధవిషయములందుఁ దన బుద్ధిని నిలిపి వానిని జాగరూకతతో ధారణచేసి సమర్థముగ నెఱవేర్చుచు నాశువుగఁ బద్యము లల్లుచుండును.

మన యాంధ్రదేశంబునఁ బ్రకృతకాలమం దవధాయకులు మిక్కిలిగ నేకవిద్యాపరిచితిఁగల గీర్వాణాంధ్రపండితులలో మాత్రమే క

సృష్టుచున్నారు. ఈ యభ్యాసమే వివిధ విద్యాభ్యాసన మొనర్చెడి యాంగ్లేయవిద్యాభ్యాసకులలో వ్యాపించినయెడ న వెంత యుపయోగకరముగ నుండును! గంటసేపు చదువఁదగిన పాఠము పావుగంటలోనే సాధింతురు. పది దినములు చదువఁదగిన గ్రంథమును రెండుదినములలోనే చదివి ధారణచేయుదురు. వివిధపాఠముల నభ్యసించునపుడు కలవరమందక చిత్త స్థైర్యమును గలిగియుందురు ఈ విద్యార్థులెల్లరును అష్టశతావధానములఁ జేయఁజాలక పోవచ్చును. కాని పదనుకొఱ కొక కొయ్యకత్తిని, ఒక యినుపకత్తిని, ఒక యుక్కుకత్తిని సమముగా సాఁచిన యెడ నొకదానియంత పద నింకొకదానికి రాక పోయినను బ్రతిదానికిని గొంత పదను వచ్చి కార్యకారియైనట్లు లీ ప్రయత్నముచేత నవధానధారణాభ్యాసములు రెండును వీరల కలవడి, యమితోపకారమును జేయక మానవు సాధారణముగా నీయవధానములందుఁ బ్రధానభాగముగఁ బరిణమించుచుండు కవిత్వమునందుఁ బ్రజ్ఞయభివృద్ధియైనయెడ సంఘోపయోగకరములగు నూతనగ్రంథముల వ్రాయనగును. ఇట్టి యవధానధారణాశుకవిత్వాభ్యాసముల నభివృద్ధిపఱచుటయే యీయవధానముల పరమావధి ఇట్టి యవధానములఁ దఱచుగాఁ జేయించి విద్యార్థులకుఁ జూపుచుండుటకు సంఘకర్ణధారులగు మహనీయు లెల్లప్పుడును బ్రయత్నించుట మహావశ్యకము.

సీ॥ అవధానమును ధారణాశుకల్పనలను దినదినం బరసి వర్ధిలఁగ జేయు
నెంద ఱెన్నివిధాల నిటు నటు లాగినఁ జంచలింపని మన స్థైర్యమిచ్చు
ధర సర్వసిద్ధి ప్రదమగు మేధాశక్తిఁ గఱకుఖడ్గము రీతి మెఱయఁజేయు
గ్రంథబాహుళ్యభారముఁ దోఁపనీయక నంతలో గ్రహియించు సూటిఁదల్పు
గీ॥ గంటచదివెడి చదు వరగంటలోనె। యలవడఁగఁ జేయుచుండు విద్యార్థులకును
మనుజబుద్ధుల నెపు డసమానగతుల। సానపట్టెడు పని యవధానమహహ.

---

కోడనే సంబోధించుటవలననే యోగ్యతను గుఱితింప వచ్చును ఇట్లే సోదరులపక్షపులేఖలకును మాపక్షపువారిలేఖలకును దారతమ్యము ప్రత్యక్షరమును గనుపఱచ వచ్చును వారిబ్రాఁతలకుఁ దల్లిదండ్రులు పెట్టినపేర్లుండవు బిరుదనామములే తెలుచుగా వెలుఁగుచుండును, ఈ యంశమువలననే వారిహృదయములను దూరదేశవాసులు గుఱితింప వచ్చును, ఇందునుగూర్చి గుంటూరిసీమ, పూర్తిగా వివరించినది, ఇంకనువివరింపఁగలదు వలయువా రందుఁ జూడఁ దగు పైవ్యాసద్వయము ను గూర్చి యొకబుద్ధిమంతుఁ డిట్లు విమర్శించి యున్నాఁడు.

(11వ మార్చి 1913 సం॥ సువర్ణలేఖనుండి)

ఆంధ్రపత్రికాసత్యవాదిగారు

......ఈమధ్యకాలమునందు సత్యవాదులు పత్రికాప్రపంచము నుండి యంతరించి మరల నేఁటి కీసత్యవాదిగారు బయలువెడలిరి. జగద్విఖ్యాతకీర్తిప్రధాన యగునాంధ్రపత్రికారాజమునకు ......జగద్విరుద్ధము లగువిషయములను లిఖించి . ... యపకీర్తి తేనెంచి యొకవ్యాసమును వ్రాసి యున్నారు. వీరివ్యాసము కామేశ్వరకవివిషయము శాఖాభిమానప్రేరితలిఖితము, పండితజనమనోవిషాదసంధాయకము అనుచితప్రసంగయుతము, వేంకటశాస్త్రిగారును తత్పాక్షికులును కామేశ్వరకవి లేనే లేరనుచున్నారట, సత్యవాదిగారూ? ......యొకింత సేపు కామేశ్వరకవివిషయ మటుంచుడు మీవిషయముననే లోకమున కట్టిసందేహము కలుగుచున్న దే? ఏమి యుత్తర మిచ్చెదరు?. .. .... మీవ్యాసము చెంప నుంపంబడిన "వేమవరపుశతావధానము" అనుశీర్షికతో నున్నసత్యనారాయణశాస్త్రులు గారివ్యాసమును జూడుడు, వారివలెనే మీరును మీతల్లిదండ్రులచే మీనామకరణమునా ఘంప

బడిన పేరు వ్రాసినచో నెంత బాగుగనుండెడిదో? యిప్పుడైన నొకింతి యోచింపుఁడు ఓనాసోదరా? అదియేమి ప్రారబ్ధమండీ? మఁతల్లిదండ్రు లుంచిననామముండ "సత్యవాది" యను గౌరవవిహీనపదము తగిలించుకొంటిరి..... ................ ............... .. . ... .. .. ..

ఇట్లు విన్నవించువిద్వద్విధేయపరమాణువు కా॥ వెంకటేశ్వరరావు

ఇట్లెందఱు బుద్ధి చెప్పినను "సత్యవాదు" లింకను నామమాత్రావశిష్టులు కానేలేదు. అందులో, పై 'సత్యవాది'ని వేఱుగా గ్రహింపవలసియున్నది. ఇంటిదొంగ నీశ్వరుఁడును పట్టలేఁడు గదా? ఈసత్యవాదులగోలకేమి గాని ప్రస్తుతిపాటికామయ్యాగారి కనేకవందనము లొసర్ప వలసి యున్నది ఏజన్మప్రారబ్ధవశముననో శ్రీసోదరులు వ్రాసినతప్పుడువ్యాసములో వ్రా లొనర్చి యున్నను, పాపము' బ్రాహ్మణుఁ డింతవఱ కెందఱెన్నివిధములమందలించినను, మాయమాటాడ లేదు గదా? అతనికన్న యోగ్యు లౌరు లుందురా? "అంటించినాఁడు, ఊరకున్నాఁడు, "ఊరకున్నవాని కూరెల్ల నోపదు విశ్వదాభిరామ వినుర వేమ" ఇంకను మెదలుచున్నవారు పో—తరాజుగారును, "శ్రీబంగారురాజేంద్రమేఘుజనిత. ...... స్వాతివర్షపూరిత.... .. గర్భశుక్తిముక్తాయమానలును నై యున్నారు. వీరొకరికొకరు తోడుపడి యసత్యవేదమునకు ఘన వర్ణించుచున్నారు, ఈశుక్తిముక్తాయమానులు మాశిష్యుఁడు శివరామశాస్త్రిని గూర్చి, **1913** సం॥ డిశంబరు, జనేవరు, **12-13** సంచికలు మనోరంజినిలో వ్రాసినయసంగతపువ్రాఁతను స్థాలీపులాకన్యాయముగా గుంటూరిసీమ, **97, 98, 99,** వపుటలలో విమర్శించి యుంటిమి, ఆమనోరంజనీపత్రికలో నొకసన్యాసిగారిని వీరు సాక్షిగాఁ గైకొనిరి ఆవులిగడ్డభీమశంకరపరమహంసగారిపవిత్రచరిత్రమును

జగమెల్ల నెఱుఁగుదురు ఆయనదీపమును మాట లాడింతురు, ఏమే మో చేయుదురు, ఆయనపూర్వాశ్రమచారిత్రమును మేము బాగుగా నెఱుఁగుదుము, ఏలూరిలోను, యానాములోను బలువు రెఱుఁగుదురు మనోరంజనీశుక్తిముక్తాయమానులకు సదృశులైనవ్యాసులనుగూడ జనింపఁ జేసినభగవంతునిసృష్టి మిగులఁ గొనియాడఁ దగినది పత్రికల నడపువారిలో మనోరంజని నడపునతఁడు కేవల మసత్యమును బుద్ధిపూర్వకముగాఁ బ్రచురింపఁ జేయుచున్నాఁ డని గురుపాదసాక్షిగాఁ జదువరులకు విన్నవించుచుఁ బ్రత్తిపాటికామయ్యగారివ్రాఁతకు దేశమాతయెడిటరుగారి పశ్చాత్తాపసూచక మగులేఖనుగూడ నిందుఁ బొందుపఱచుచున్నారము

డి15—2—13

రాజమండ్రి.

చిలకమర్తిలక్ష్మీనరసింహము, నమస్కారములు,.. ...మహాపత్రికలో మీమీఁద నేదో కొంత వ్యాసము ప్రకటింపఁ బడిన దని వ్రాసితిరి, అది నిజమే కాని దానిప్రకటనమునుగూర్చి నే నెఱుఁగను ఉపవిలేఖరులవ్రాఁత లన్నియు మఱియొకరు చూచి ప్రకటింతురు, ఉపవిలేఖరులవ్రాఁతలలోనిసత్యాసత్యము లెట్లు సంపాదకులకుఁ దెలియును,———గొప్పవారికి శత్రువు లుండుట సహజము, అందుచేఁ గొన్ని యిటువంటియబద్ధము లప్పు డప్పుడు పుట్టుచుండును ..................

(ఇంగ్లీషుచేవ్రాలు)

ఈపత్రికాధిపతి ప్రకృత మెట్లో తప్పికొన నెంచుచున్నట్లు పై వ్రాఁతవలన విస్పష్టమే, ఈయనకూడ నాంధ్రపత్రికాధిపతివంటి సహృదయులులే యగుట నిక్కమే కాని యింతకుమున్ను గొన్నియయుక్త

ఫ్రువ్రాఁతలను బుద్ధిపూర్వకముగాఁ బ్రకటించి యుంటచేఁ గొంతవఱకు చింతింపఁ దగియుంట నిక్కము, అయినను శ్రీబ్రహ్మసామాజికశిరోమణి మాలో నొకరికి స్వశాఖాబంధు వగుకతన విశేషించి నొక్కి వ్రాయ రామి విరమించుచున్నారము కవన మన నేమో యెఱుఁగనివారిపే రునఁ బద్యములు వ్రాసి యెవరో పంపఁగా శ్రీశ్రీయుతచిలకమర్తిలక్ష్మీ నరసింహకవిగారు కైకొని ముద్రించి యున్నారు, దానిపేరే శృంగ భంగము దీనింగూర్చి వీరితోఁ బ్రత్యక్షముగా నొక్కింత ముచ్చటింప వలసియున్నది, అచిరమ్మునన యది సంఘటించుఁగాక, వ్రాఁత చేతికి వచ్చినప్పు డేదో తెలుఁగునఁ దప్పికొనక చేయ వలసిన దేమి యుండు ను, వీరినిగూర్చి మాలోనొకరిపినతండ్రిగారికుమారుఁడిట్టు వ్రాయుచు న్నాఁడు అతనియోగ్యతనుగూర్చి లక్ష్మీనరసింహకవిగారు స్వయము గా గుఱుతెఱుఁగుదురు గానఁ బ్రత్యేకము వారికొఱకై యాతనివ్రాఁ త నొక్కించుక యుదాహరించుచున్నారము.

22—8—11

....... ఈమధ్యవ్యాసమూర్తిశాస్త్రిగారితమ్ముఁడును శాస్త్రు లుగారును దేశమాతలోఁ బ్రకటింపుఁ డని యెద్దియో తెచ్చినట్లును, అంత హెచ్చుగాఁ బ్రకటింప మనఁగఁ గొంచెముగానే వ్రాసి యిచ్చిన ట్లుచు, నాకుఁ దెలిసినది. అందులో.....ట్లును.....సియు..... నియు ......తుచ్ఛముగా ననన్వయవాక్యములుగా వ్రాయఁ బడి యున్నది. పేరు లేక "తత్సభాంతర్గతుఁడు హితవాది"అని యున్నది, ఇదియెల్ల వ్యా సమూర్తిశాస్త్రిగారివ్రాఁత యని నాతలంపు, దానికి నకలు వ్రాసితిని ..... కొన్నందునఁ బంప లేదు, లక్ష్మీనరసింహముగారికి నేయేపెద్దల

దుర్బోధవలననేమి కొంతపక్షపాత మట్లే యున్నట్లు తోఁచుచున్నది, ............వారు వ్రాసియిచ్చిన . .వాక్యములఁ బ్రకటింపకుండఁ జేసితిని లక్ష్మీనరసింహముగారు "వారిట్లు వ్రాసి రని నాతోఁ జెప్పినప్పుడు...... గదా యని నే నేమియు నాయనతో సంభాషింప లేదు గాని అచ్చుపడకుండునట్టియేర్పాటు మాత్రము జరిగించితిని. చె॥ వెం॥

శత్రువులచేఁగూడ—"సన్నుతాచారుఁడు చిన్న వెంకటశాస్త్రి" అని నుతింపఁదగు నీయోగ్యుఁడు శ్రీలక్ష్మీనరసింహకవిగారికిఁ బక్షపాత మున్నట్లు లిఖించినందులకును వీరిపత్రికలోని వ్రాఁతలకును దార్కాణముగా నున్నది. బ్రహ్మశ్రీ ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిలవారి యంతవారు సహోదర్యముగా వచ్చి మారుపేరితో దాఖలుచేసిన వ్రాఁత కూడఁ బ్రకటింపఁబడినచో నెంత చక్కఁగ నేని యుండును గాని మాపిన్నతమ్ముని యమాయికత్వము కతన నది జరుగలేదు. మేమే అయినచో దానివారణకుఁ గా యత్నింపము చదువరు లెఱుఁగుదురుగాక, ఏతుచ్ఛపు వాక్యములనేని బయటకిరానిచ్చి విమర్శించి సత్యము దెల్పుట మాముఖ్యోద్దేశము ఈయంశము 'గుంటూరుసీమ' లో నుదాహరించిన శ్రీ కొప్పరపువారి తప్పుడుత్తరములవలననే జగమెఱింగి యుండును గాన విస్తరింపము. ఇంతకు లక్ష్మీనరసింహకవిగారే వ్రాఁతనుగాని బుద్ధిపూర్వకముగనో పొరపాటుననో ప్రకటించినప్పు డిచ్చెడి ప్రత్యుత్తర మేదియో యిదివఱకే యుదాహరించితిమి. అందుననుండియే మఱి కొన్ని వాక్యముల నిట నుదాహరించుచున్నారము—

"చెడ్డవ్రాఁత నెవరైన వ్రాసినపక్షమున దానిని ఖండించి మఱి యొకరు వ్రాయుటయే దాని కది ప్రాయశ్చిత్తము"

ఇట్లు జవాబు వ్రాయుటకన్న వ్రాఁతయందలి నికృష్టత పూర్తిగా బోధపడినప్పుడు త్యజించుటగాని చేయి దాఁటినచో దిద్దుబాటు

ను ప్రకటించుటగాని నిష్కపటులగు పత్రికాప్రవర్తకుల ధర్మమని మా యభిప్రాయము. మున్ను మాశివరామశాస్త్రి శతావధానమునుగూర్చి "సత్యవాది" యను నొక ఘనుఁడువ్రాసిన వ్రాఁతను మొదటఁ బ్రకటించి దాని సత్యమును బిదప నెఱిఁగి, "ఆంధ్రకేసరి" అట్లు యొప్పి నిర్దోషియై మార్గప్రదర్శక మైనదని మాలక్ష్మీనరసింహకవిగారికి విన్నవించుచు "మరల ఖండించి వ్రాయుటవలన నంతగాఁ బ్రయోజనముండఁబోదను నంశము వారును నెఱిఁగినదియే యైనను శ్రీముట్నూరి కృష్ణారాయ శతకమునుండి యందుకుఁగా నొక పద్యముదహరించుచున్నారము—

> శా॥ నారీరత్న మొకర్తు అంకుదనుచుఙ్ వ్రాయించి యామీఁద టఙ। వేఱొక్కప్పుడు "సాధ్వి నిక్క" మనుచుఙ్ వేయింపుమె ట్లుండునో। భారంబుఙ గనకయ్య యున్న నిజముఙ బల్కంతు నీచేతఁ గృ। ష్ణారాయా? వచియింపుమయ్య? మన యీ. .... డెట్టిఁడో?"॥

కావునఁ బత్రికాధిపతులు మొదటనే పరిశీలింపవలసియుండును. లేదా వీరివలన లోకమునకుఁ గొంత నష్టియే కలుగవలసి యున్నది. ఆనష్టిని వారించుకొనుటకుఁ గొంత ప్రయత్నము చేయవలసియుండును. ప్రతివారును మావలెఁ దమ జీవితము నీపాడు వ్రాఁతలను ఖండించుటలో వినియోగింపరుగానఁ బత్రికాధిపతులు మంచిచెడ్డ లెఱింగి ప్రకటించుటయుక్తమేమోవారే యోజించుకొందురుగాక. ఇంతవఱకు వ్రాసినది ప్రమాద జన్య దోషమునుగూర్చిగాని బుద్ధిపూర్వకముగాఁ బ్రకటించువారికిఁగాని యెవరిపేరనో తామే పాడవ్రాఁతలు వ్రాయు వారికిఁగాని యుపదేశింపఁ దగినది లవమును లేదు. ఆ యీవిషయము నుగూర్చి కూడఁ బై నుదాహరించిన శతకమే బోధింపఁ గలదు. ప్రసం

గముకలియని మఱికొన్ని పద్యము లందుండి యుదాహరింపఁ బడుచు
న్నవి.

శా॥ ఔరా? సాటి నియోగిసజ్జనులు వేదాచారసంపత్తికై। ధీరుల్
సారెకుఁ జేయు సత్సభను నిందింపంగ నీతంబు మా। ర్వేరిఁ
దాల్చి లిఖించె నీ వెటుఁగ వేవేసంబు ముట్నూరి కృష్ణారాయా?
వచియింపుమయ్య మన యీ. . .డెట్టేఁడో॥౨॥

శా॥ చీరల్ వెట్టు మొసంగు మన్నమును వాసిఁ బెంచు మీరీతిగాఁ।
గారుణ్యమ్ము వెలార్చి సత్యమును లోకం బెక్కఁగాఁ జేయుమీ।
ధీరమ్మన్యనితోడఁ బోయినదొకో దేశమ్ము ఘూర్ణిల్లెఁ గృ।
ష్ణారాయా?వచియింపుమయ్య మనయీ. ....యీ డెట్టేఁడో॥౩॥

శా॥ వైరుల్ పండితులెల్ల సత్కవులునుఁ వైరుల్ సదాచారవి।
స్తారుల్ వైరులు యజ్ఞకర్తలు నితాంతమ్ముఁ మహావైరు లీ।
ధీరమ్మన్యన కీ వెలుంగ సిదియే తెల్లమ్ము ముట్నూరికృష్ణా
రాయా? వచియింపుమయ్య మనయీ. . .డెట్టేఁడో॥౪॥

శా॥ శూరుల్, సూరులు, వీరితో జగము హెచ్చుఁ జచ్చు నిక్క
మ్మిదే కాఱుల్ సించఁగ రాదు వీరిపయి దుష్కాపట్యముం
బూని యే రారాధింతురు వీరి వారు సుజనుల్ హాస్యమ్ము
ముప్పాను గృష్ణారాయా వచియింపుమయ్య? మనయీ.....
డెట్టేఁడో॥౫॥

శా॥ పేరా బ్రహ్మమతమ్ము నీది యది నేఁ బ్రేమింప, నట్లైన నీ,
ధీరత్వమ్మును యోగ్యతాగరిమయుం దేజమ్ము నా కెంతయే
నారాధ్యం బటువంటినీ వితనివామ్యం జేల దాఁచంగఁ గృష్ణా
రాయా?వచియింపుమయ్య మనయీ.....డెట్టేఁడో॥౬॥

ఇవి నూఱుపద్యములు కొలఁదికాలములో వచ్చెను. ఈపద్యములమూలముననే కాక కృష్ణాపత్రికావ్యాసమూలముననుగూడ సత్యనిర్ధారణకుఁ దోడుపడుఁ డని శ్రీకృష్ణారావుగారిని గోరి యుంటిమి, దానింగూడఁ గొండొక యుదాహరించుచున్నారము.

(1వ ఫిబ్రవరి 1913సం॥ కృష్ణాపత్రికనుండి)

అయ్యా, మేము గుంటూరిసీమకు వెళ్లిన దాదిగా మాపై నసూయచే నెవరో పేరులు దాఁచి మమ్ము నిందించుట యే ప్రధానముగాఁ గొన్ని వ్యాసములకట్టలు . ...తాము పరిశీలించియో పరిశీలింపకయో ప్రకటించుటయు మేము.... ఉపేక్షించి.... మిన్నకుంటయుఁబిమ్మటఁ దమంతటఁదమకే నిజము బోధపడుటచేతనో లేక విసువుజనించియో అట్టివ్యాసములు ప్రకటించుట మానుటయు లోకగునంశములు తమచిత్తముకే విశదము . .. ఆంధ్రపత్రికవారు ప్రత్తిపాటివ్యాసము నేమని ప్రకటించిరో తగుసమాధానము మీరు చెప్పఁ గల రను నమ్మకముతో మీకు వ్రాసికొన్నాఁడను ..... తమయభిప్రాయమును విపులముగనో సంగ్రహముగనో ప్రకటింపఁ గోరెదను

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి. శతావధాని

ఇట్లెన్నివిధముల హెచ్చరించినను వీరు తమకుఁ దెలిసినసత్యమును బత్రికామూలమునఁ బ్రకటించుటయే లేదు. వ్యాగ్రూపముగా నెఱవుట మేమే కాక మఱికొందఱుగూడ నెఱుఁగుదురు, ప్రకటించుటకు వీరికిఁ గలసందియము ప్రకృతకలహము వైదికత్వనియోగిత్వమూలకము గావుఁ దాము వైదికులై వైదికపక్షమున న్యాయ్యమైనను వ్రాసినచోఁ బక్షపాతిత్వప్రయుక్త మగునపయశము వచ్చు ననునది గా వారిప్రసంగమువలననే మేము గ్రహించితిమి, ఇదిగాక "పృష్ట తాడనాద్దం

తభంగ" యనునట్లున్న మా ప్రశ్నకు వీరు జవా బిడకున్నను లోక ము న్యథాగా భావింపదు అయినచో నట్టి తెల్వితక్కువప్రశ్న మీరు వారి నేల చేసితి రని చదువరు లడుగవచ్చును, ఉన్నరహస్య మంతయు నీ యడుగుటలోనే కలదు గాన, జదువరు లీమాప్రశ్నమును నిరసింపకుం దురుగాక యని యంజలిఘటించుచున్నారము, అడుగరానిదియే యైన చో శ్రీకృష్ణాపత్రికాధిపతులు గా కు సంబంధము లేదనియేని ప్రత్యు త్తరము నీయకుందురా? దీనివలననే యడుగుటకుఁ గలబీజమును మీా రు నిర్ణయించుకో వచ్చును శ్రీకృష్ణా రావుగారు పైకి నేవిధ మగు ను త్తరమును బ్రకటింపకున్నను లోలోనఁ దమమిత్రునిఁ బూ ర్తిగా మందలించిరి ఆమందలింపుపై నాతఁడు కొండొకబిరుసునకుఁ దక్కి మె త్తవడినపెం కెతనముతోలిఖించినయు త్తరమును మాకునొసఁగియున్నా రు అంతగా నుపకరింపనిదియైనను నతనిప్రకృతిని దెలుప నగునాయు త్త ర మిట నుదహరించుచున్నారము

"...... శతావధానులవారికి మనస్తాపము కలుగజేయుట నా యభిప్రాయము కాదు" ఇపుడు చేయదగినపరిహార మేమి? యోజిం పుఁడు ...... వ్రాసినపద్యములు వ్రాయునే వ్రాసిరి వీలయినయెడల శ తావధానులవారితో నాబొమ్మను గూడ వేయవలయు నని మనవి చే యుఁడు నేను దయ్యమై పట్టలేదు దేవతగానే ప్రత్యక్ష మైనాను,...... విధేయుఁడు (చే. వ్రాలు) 9—?—13

"యేన కేనాఽప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్"

అను తెలుఁగున నిప్పుడు పలువురు యత్నించుచున్నారు అందు

లో నీనుహాభాగుఁ డొకఁ డని యాతనిచేతివ్రాఁతయే తెల్పుచున్నదిగ దా? బొమ్మవేయవలయునఁట? తప్పేమి? అట్లే జరుగుఁగాక, ప్రసిద్ధపు

రుషసమాగమము వలన నప్రసిద్ధులకుఁగూడ “గంగారథ్యోదకన్యాయమున యోగ్యత కలుగవచ్చునుగదా? ఇది యిటులుండఁగాక, శ్రీకృష్ణారావుగారు తమకు వైదికత్వాభిమానము లే దనిపించుకొనుటకై మమ్మునుగూర్చినవైరులలేఖలెట్టివైనను బ్రకటించుటయు మాపక్షమునవచ్చిన వెంతటిఘనులు వ్రాసినవైనను సంశయించి సంశయించి తుద కెప్పుడో ప్రకటించుటయు లేక మానుటయు జరిగించుచున్నకారణమున నిజ మగువీరిహృదయము నెఱుఁగనిలోకులు పలువురు వీరిపై నింద మోపుచున్నారు, అట్టిలేఖలు గొన్ని యుదాహరించుచున్నారము,

బెజవాడ
19—3—13

(1) “......సువర్ణలేఖలోని “తవిటిరొట్టెను” ఆంధ్రపత్రికలోని ప్రత్యుత్తరమును జూచినాఁడ, తమతో బోరాడుటనే గౌరవముగా నెంచి వారు తూలనాడుచున్నట్లు నాకు దోఁచినది,... ఎట్లయినను కృష్ణా, ఆంధ్రపత్రికలు, తమకు బ్రతికూలములుగనే యున్నవి. . ......

చేతపూడి భగవంతరావు
బెజవాడ 24—11—13

(2) “. .... కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, నగైరాపత్రికలు, మే మేపక్షమును వహించ మని చెప్పుచూ తుద కటులనే అభిమానమును సూచించుచున్నవి.....

వేలమూరి గోపాలకృష్ణయ్య
మండవల్లి 10—3—13

(3) ......అయ్యా, వేమవరపు శతావధానమును గురించి ప్రత్తిపాటి కామేశ్వరకవిగారు అసంభావ్యవచనములను 22-1-13 సం॥

ఆంధ్రపత్రికవల్ల వెల్లడిచేసియున్నారు. ఆంధ్రపత్రికకు 1911 నంబరు శాశ్వత చందాదారునగు నేను పైవిషయమునకు సంబంధించిన వ్యాసమును వ్రాసి ప్రచురపరచుటనుగాను ఆంధ్రపత్రికా మానేజరువారికి పంపుచు ప్రచురపరచనియెడల తగుకారణము వ్రాయుచు తిరిగీ పంపవలసినదని ఒక అణాచీటినిగూడ అందుతో జేర్చి 28-1-13 న పోస్టులో వేసితిని. వారు ఏకారణంచేతనో ప్రచురపరుపలేదు. తిరిగి పంపలేదు......

భమిడిపాటి అప్పయ్యశాస్త్రి,
హెడ్ మాస్టర్.

ఇట్లిందఱో నిరాశులై వారివారివ్యాసముల నకళ్లను గూడ మాకడ కంపుచు వచ్చిరి. మాపక్షమున నౌదాసీన్యము నటించుటం గూర్చి కృష్ణకుఁ గల్గిన కొంకును వివరించితిమి. ఆంధ్రపత్రిక కట్టిదానిని జెప్ప వలనుపడకు గాని యింతకు మున్నుదాహరించిన బలవత్కారణమే యాయాయీవ్యాసములనెల్ల దిగమ్రింగుటయుఁ దోఁచినట్లెల్ల దిద్దిపాటుచేయుటయు జరుపుచున్నది. ఆయంశ మీక్రిందియుత్తరమువలన నెఱుఁగఁదగు.

31 లింగిసెట్టివీది
మదరాసు
3—3—13

" ......నేను యీమధ్య ఆంధ్రపత్రికకు వ్రాసినదానిని ఆపేనుభూతము అపభ్రంశమొనర్చినది. నియమములచోటను బుజ్జటవిట్టలవిషయమునను మొట్టమొదలను యింకా విస్తరించివ్రాసియుంటిని..... తమతో పరిచయములేకయే వ్రాయ సాహసించినందులకు క్షమింపు

డు. వేమవరం వెళ్లినప్పుడు బెజవాడ స్టేషనులో తమ్మును కలిసి కొం టిని. వేమవరముకూడ వచ్చినాడను. నరసరావుపేట గ్రామవాసిని...

మల్లాది సోమసుందరం.

......నామరూపములు లేనివారివ్యాసములు కన్నుల నద్దికొని వెంటనే ప్రచురించుటయు సోమసుందరంగారివంటి విద్యాధికుల వ్యాసముల నడుగఁద్రొక్కుటయుఁ దుదకు వారు లా, కాలేజీవారగుటను సూచించిరో యన రిజస్టరుత్తరములు పెట్టుటయు నప్పుడు నిజమయిన పత్రికాధిపతులు పరికించి ప్రచురణమునకుఁ బురికొల్పుటయుఁగూడ జరుగుచువచ్చిన దనుటకును వీరిదే యొకయుత్తర ముదాహరించుచున్నారము.

Copy of the Registered letter from M Somasundaram B A Law Coelege Madras, 31 Lingi Chetti Street to the Editor, Andhra Patrica, Bombay

"......అయ్యా? కడచిన నెల 22 వ తేదీ తమసంచికలో వేమవరపు శతావధానముగుఱ్ఱిచి ప్రత్తిపాటి కామేశ్వరకవిగారు వ్రాసిన వ్యాసమును జూచి దానిలో పెక్కు అసత్యము లుంటజేసియు ఆఅసత్యములు లోకమునకును శ్రీ శతావధానుల వారి యశోగౌరవములకును హానియు నిరాటంకముగను శాస్త్రీయముగను జరిగిన అవధానయశమునకు లోపమును గలుగునేమో యనుశంక జెంది వీరికిని శ్రీ కొప్పరపుంగవులకు జరుగు కక్షలలో లేశమేని జోక్యము కలుగఁజేసికొననివాడ నగుటంజేసియు ప్రత్యక్షముగ అవధానముచూచినవాడ నగుటంజేసియు జరిగినవిషయములను నిష్పక్షపాతబుద్ధితో వెల్లడించుట విధాయకమని యెంచి తమపేర 28 వ తేదీని, విపులముగ ఆయా విషయములు వ్రాసి యొకవ్యాసము పంపియుంటిని. ఈనెల 5వ తేదీ

సంచికలో తాము దానిని ప్రచురింపరైరి. పత్రికాధిపతులు పక్షపాతరహితులుగా నుండరనియు స్వాభిప్రాయములెట్లున్నను విలేఖరులు విద్యాగౌరవములు గలవారని విశదమైనప్పుడు వారంపువ్యాసములు తప్పక వేయుదురను నమ్మకముతో శ్రమ కోర్చి సత్యమును వెల్లడింప యత్నించితిని. ఈవిషయముకన్న అముఖ్యములును పురాతనములును అగు విషయములు వేయ గలిగినపుడు నావ్యాసము వేయుటకు తమకు స్థలము లేదనుకొనుటకును అవకాశము లేదు. కృష్ణాపత్రికలో బ్రహ్మశ్రీ తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు అవధానవిషయములనుగూర్చి వ్రాసినవ్యాసమును నేను వ్రాసిన వ్యాసమును పదపడి కృష్ణాపత్రికలో కామేశ్వరకవిగారి వ్యాస సత్యములనుగూర్చిన శ్రీ వెంకటకవిగారి విజ్ఞాపనమునుగూడ చూచియు తమరు సత్యమును పత్రికాముఖముగా వెల్లడింపకుండుట శోచనీయము యిప్పటికైనను నావ్యాసమును ప్రకటింప గోరెదను. అట్లు చేయుటకు తమకు ఇష్టము లేనిచో ఇందుతో అర్ధణాబిళ్ల పంపడమైనది. ప్రచురింపకుండుటకు తమకారణములను దెల్పినచో మిక్కిలి కృతజ్ఞుడనయ్యెదను. తమకు ఈయుత్తరము అందదేమో యను సంశయముతో రిజష్టరు చేయుచున్నాను.

Yours faithfully

8th Feb 1913 (Sd) M S Sundaram.

దీనిమీఁదఁగాని పత్రికాప్రధానులు జోక్యము పుచ్చుకొనుట తటస్థింపనే లేదు. వారితరఫునఁ బత్రిక నడుపు నామహామహులకు లాకాలేజీవిద్యార్థి వ్రాసిన వ్యాసముకన్న కల్పితనామములును నసత్యప్రవక్తలును నగు వారివ్రాఁతలే ముఖ్యము లగుటకు హేతువు విచార్యము, "ఇనుమునుబట్టి యగ్గికిసమ్మెటలు" అను దెబ్బగాక నీలోప

ము తెల్ల ఘనహృదయులగు శ్రీ నాగేశ్వరరావుగారిపైకి వచ్చుటకు మేము మిగులఁ జింతిల్లుచున్నారము. వీరిని గలిసికొనకున్నను, వీరియు త్తరములవలన వీరియోగ్యత యనన్యాదృశమని మేమెఱుఁగుదుము. ఇటీవల వీరు బందరులో నిన్న మొన్న జరిగిన కృష్ణామండలసభకు వచ్చినప్పుడు వీరిని దర్శించుటకూడ జరిగినది. విశేషముగాఁ గాని కొలదిగాఁగాని మాటలాడకున్నను మూర్తిని జూచినంతనే పరమయోగ్యులుగాఁ బొడకట్టిరని వ్రాయుటకుఁ గొంకము, మ॥రా॥రా॥ కృత్తివెంటి గంగరాజుపంతులుగారు వీరితోఁ బ్రకృతవిషయమున మాటలాడి మాతో నాయాయీవిషయములను జెప్పిరి గ్రంధవిస్తరభీతిచే నయ్యవి యిందుదాహరింపమైతిమి. సారమేమనఁగా? వీరిలోపముసుంతయు లేదనియు నౌకరులలోపముచేఁ బత్రికకీయపయశము వచ్చుచున్నదనియు దానిని వారించు కుతూహలముతో శ్రీ నాగేశ్వరరావు పంతులవారున్నారనియు వింటిమి. ఇఁక నీఘనహృదయులు లా కాలేజీ విద్యార్థిగారి కిచ్చిన ప్రత్యుత్తరమునుండి కొంచెముగ నుదాహరించుచున్నారము.

10-2-13

"ఆర్యా! తాము ౯వ తేదీని వ్రాసిన జాబు చేరినది. తాము వెనుకను పంపినవ్యాస మీవారపత్రికయందు ముద్రితమైనది. పత్రిక చేరినపుడు తమరు దానిని చూడగలరు.... .పత్రికాధిపతికి పక్షపాతభావము లేదని విన్నవించుచున్నాను. ముందవసరమైనపుడనగా యథార్థము రూఢి అయినపుడు పత్రికాభిప్రాయమును వ్యక్తీకరింప బడును... .. అసత్యపు వ్రాతలను వ్రాసి పత్రికలకు నయితము కళంకమును దెచ్చుట శోచనీయము. దేశాభిమానులు భాషాభిమానులు వైదిక నియోగకక్షను రూపుమాపవలసియుందురు.

విశ్వసనీయుడు,
కా నాగేశ్వరరావు.

ఆయాయీయుత్తరములవలన ననేకాంశములు చదువరులకుఁ దెలిసియుండును. ఇట్లుండఁగా నీనాగేశ్వరరావుగారు వెనుక నెపుడో శ్రీ సోదరకవులకును మాకును విద్యావిభాగము నేర్పఱచినట్లును దా నెఱిఁగినట్లును నొక పరిచ్ఛిన్ననామముఁ డొకవ్యాసము నంపఁగా నద్దానిని శ్రీ ముట్నూరి కృష్ణారావుగా రనవసరమని తలఁచియు. బ్రచురించిరి ఆప్రచురించుటకుఁ గారణము మున్ను చూపినదియే కావచ్చును. ఆ వ్యాసమునుబట్టి మేము శ్రీనాగేశ్వరరావుపంతులవారిని గొన్ని యంశము లడగవలసివచ్చినను ఇతరకారణములచే వారి యోగ్యత నెఱిఁగి యుండుటచేతను మున్ను వారుప్రచురించిన వ్యాసతత్వము దెలిసినవారమగుటచేతను నందులకుఁ బూనమైతిమి. ఆవ్యాసపుబంక్తులు గుంటూరిసీమ, ఉత్తరరంగమున నుదాహరించి విమర్శింప నెంచుచుఁ బ్రకృతము కృష్ణావ్యాసమును గొండొక యుదాహరించుచున్నారము.

(8 మార్చి 1913 సం॥ కృష్ణాపత్రికనుండి)

కవుల కలహములు.

"......ఆశుకవిత్వమునందు సోదరకవులును, భాషాపాండిత్యమునందు తిరుపతికవులును, అతిశయులని ఆంధ్రపత్రికాధిపతిగారు తమ యుద్దేశమును వెల్లడించినారు. ఈవిషయ మిట్లంగీకరింపబడఁగా. .. .విద్యావిహీనులును మూర్ఖులును అగు సామాన్యముగ వీధులలో తిరుగు పోగరుబోతులు ఒకరినొకరు జయింప వలయునని కుస్తీకి సవాళ్లు కొట్టినటుల "విద్యవలనకలుగు వినయంబు" అనెడి యార్యోక్తిని మఱచి సమయము వచ్చినపుడెల్ల ఆంబోతురంకెలు వేయుచు పోట్లాడనుంకించుటకన్న నీకవులయొక్క విద్యానైపుణ్యమునకు మఱియొక కళంకము లేదని విన్నవించుచున్నాడ ...తిరుపతికవులు కొన్నిగ్రంథములు వ్రాసి డబ్బును సేకరించుచున్నారు. కొప్పరపుకవులు ఆశుకవి

త్వమువలన సుఖజీవనము చేయుచున్నారు...కుక్షింభరులు మనదేశ మందు కోటానకోట్లుండ వీరితో జోక్యము మనకేల.

ఇట్లు హితవాది బెజవాడ.

ఈ "హితవాది" తననిజనామమును దాఁచుటకుఁ గారణమేమి? వ్రాఁతయం దవకతవకలు విశేషించి యుండుటయే యని నిశ్చయింప వలసి యున్నది. ఇట్టి నోటిదురుసు వ్రాఁతలయందు మనకృష్ణారావుగారికి ననాదరమేల కలుగలేదో? విద్యాధికుల వ్రాఁతలయం దనాదరమేల కలుగుచున్నదో యీయంశము కడు విచార్యము, ఇతనిపేరు తెలిసినచో నితండు కుక్షింభరియో లేక నిరాహారియో తేల్తుము గాని పేరు దాఁచికొన్నాఁడు. ఇది యిటులుండ నీప్రచ్ఛన్ననామునివ్రాఁత "యదనంతర న్యాయమున మాసోదరులను బూర్తిగా నుద్దేశించుచున్నది. ఇదివరలో నేమి, నిన్న మొన్న కృష్ణయందును, ఆంధ్రపత్రికయందును బ్రకటించిన యసత్యపువ్యాసములవలన నేమి వారే కాలు ద్రవ్వువారని మూర్ఖునకేని విశదము కాకమానదుగదా? ఐనచో మీకేల యవసరమందురా?

శ్లో॥ విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం"

అను న్యాయమున విద్వాంసుఁడగు వాఁడు విద్యావంతులం గూర్చి భూషించుటయో దూషించుటయో సల్పుఁగాక దానివలనఁ గొండొకలాభ మున్నదని పత్రికవారుగాని యితరులుగాని తలఁతురుగాక ఈ"హితవాది"వంటి పంచాశదక్షరమాత్ర విజ్ఞాతలకును విద్యాకలహమునకును సంబంధమేమి? ఈయన తెల్వి యెంతటిదో తెలుపఁదగు నక్కజములు గొన్ని యుదాహరించుచున్నారము.

# ఉపోద్ఘాతము

ఈగ్రంథమిప్పటికి 11 వత్సరములనాఁడు రచింపఁబడినదైనను బ్రకటనావస్థ నేఁటికిఁగాని ప్రాప్తింపదయ్యె నేనీదేశంబున యత్నించి ద్యశస్సంపాదనకుంగడంగి యవధానములుచేయుతఱి నొక్కచో నేతత్కృతిపతియగు మహారాజశ్రీ ఏకా గోపయ్యగారు మామకీయాష్టావధానాదివిద్యాగోష్ఠీ సందర్శనప్రముదితస్వాంతుండై "కేతవరనృసింహస్వామిచరిత్రమును బ్రబంధశైలినివ్రాసి నాపేరఁగృతియిం" డని నన్నభిలషించెను. నేనందులకియ్యకొని "వాసంతికాపరిణయ" మనుపేర నయిదాశ్వాసముల కావ్యమురచించి కొలఁదిదినములలోనే తత్సమీపమునకుం గొనిపోఁగలిగితి- "వణ్ఛటూరి"యను నొకద్రావిడయతి రచించిన సంస్కృతవాసంతికాపరిణయ నాటకస్థమైనదే యిందలికథ-కాని యహోబిలనృసింహునికిమాఱుగఁ గేతవరనృసింహుఁడే యిచ్చటఁ గథానాయకుఁడుగఁ గైకొనఁబడియున్నవాఁడు. కృతిపతి యుచిరమ సబహుమానముగఁదా నీయనెంచిన సత్కారధనము నొసంగి తనగ్రంథముం దాఁగైకొని యచ్చుగూర్పించుకొనినవాఁడు కాఁడు- ఆకారణమున నొకనాటకసంఘమువారు న''న్నొక నూతనరూపకము రచించియి"మ్మనికోరినపై వణ్ఛరారికృతవాసంతికాపరిణయనాటకమునకుసరియైన తెనుఁగునాటకమేవ్రాసి ప్రకటించియుంటిని. వాక్యములును గొన్నిపద్యములును నూతనకల్పితములైనను నీనాటకమునఁ జేర్పఁబడిన యనేకపద్యములు ప్రథమము నేనువ్రాసిన ప్రబంధములోనివే యైయున్నవి. నేఁటికాలమున కెట్లో మాకృతినాథునకు బుద్ధి మరలుటచే నిప్పుడీగ్రంథముం బ్రచురింపవలసిన ప్రసక్తిపట్టినది. కథాసందర్భమునకు విరోధమువాటిల్లనంతవఱకు నాటకములోఁ జేర్చి

న పద్యములు చాలఁదీసివేసి ప్రప్రథమఁచిత్రములఁగొన్నింటిని నేత త్కాలికములఁగొన్నింటిని గూర్చి సంక్షేపముగ మూఁడాశ్వాసముల గ్రంథమే ప్రకటించినవాఁడనైతిని. నాటకమున సంస్కృతనాటకమం దున్నదియున్నట్లహోబిలనృసింహునే కథానాయకునిగానుంచినను నే తత్ప్రబంధమున మరల మాకృతిపతియిష్టానుసారముగఁ గేతవరనృ సింహుని నాయకుంగాఁ గైకొంటిని. కేతవరము సత్తెనపల్లి తాలూ కాలోని యొకకృష్ణాతీరపు గ్రామమైయున్నది. బహుకాలముక్రిందట గోలకొండనవాబొకఁడు తన యేలుబడిలోనుండిన యీ కేతవరమున వజ్రపుగనులున్నవనివిని తనపరివారముంగొంతపనిచిత్రవ్వించినట్లును, అప్పట్లఁ బరిజనులలోని "సుంకరనరు" సనువాని కొకవజ్రముదొరక న దిరొయొరులెఱుంగకుండఁ దనజంఘుంజీల్చి యటఁబ్రచ్ఛన్నముంగావించి గడ్డపాఱయో యేదియో తగిలి గాయముపడినవానివలె నటించి కట్టు కట్టుకొనినట్లును, అంతనారాత్రి వ్రణబాధాపీడితుండై కనులుమూసి యొక్కంతనిద్రలోవచ్చిన యాతనిస్వప్నంబున నృసింహుండు సాక్షాత్క రించి "యేతన్నికటభూధరశృంగంబున నొకరాతిపై నావిర్భవించియు న్న నా కాలయముగట్టింపసంకల్పించినచో నీకీబాధయుపశమిల్లి జీవింప గల"వని యనుగ్రహించినట్లును,గాయముమాని కాయము నవచ్ఛాయ మైనతదుపరి యాతఁడావజ్రముం బదివేలరూప్యంబులకువిక్రయించి యా ద్రవ్యముచేఁ గొండమీఁదను గొండక్రిందఁ గృష్ణయొడ్డునను నాలయ గోపురప్రాకారాదినిర్మాణముం జేయించినట్లును, తరువాతఁగొంతకాల మునకీప్రదేశము ధరణికోటరాజు నేలుబడిలోనుండినప్పుడు కేతరాజొక పర్యాయమాదేవునిసందర్శించి యొకయగ్రహారంబొసంగినట్లును,మఱి కొంతకాలమునకీదేశము వాసిరెడ్డివెంకటాద్రినాయనిపాలనముక్రిందికి

రా, నామహాదారుఁడు పర్వతాధఃప్రదేశమునుండి పైనుండిన శ్రీనృసింహాలయమువఱకును సోపానములుకట్టించి మఱికొంతకైంకర్యవిధి కూడ నెఱపి కృతకృత్యుఁడైనట్లును, కేతవరప్రాంతపురాతవృద్ధులు చెప్పుచుందురు. ఇందుఁ గొన్ని హెచ్చుతగ్గులున్నను నీయానుపూర్విమాత్రము చాలవఱకుఁ నమ్మఁదగినదికానే కన్పట్టుచున్నయది.

క॥ “శ్రీకృష్ణాపూర్వతట। ప్రాకారప్రాంతకుతలపరిశోభిత వ
జ్రాకర కేతవరనగర। నాకారివిదిగ్ద్వియోజనస్థితభవనా ”

అను నప్పకవిపద్యము కేతవరము పూర్వము వజ్రపుగనులుగల ప్రదేశమగుటను ధ్రువపఱచుచున్నది. ఇప్పటికిం గేతవరమునను జుట్టుపట్లను బెద్దపెద్దగుంటలు చాలఁ గంటఁబడుచు నవియే పూర్వము వజ్రములు త్రవ్వినస్థలములని యాధునికులచే వాడుకొనఁబడుచున్నయవి. తత్ప్రాంతముందేయుండిన “ చెంగలమ్మతోఁప ” యనునది పూర్వము వజ్రపుగనులు తీసిన యనేకసహస్రజనులు భుక్తిసాధనకుఁగాఁ బులుసుపిసికికొని పాఱవైచినచింతపండులోనివిత్తులవలన మొలిచిన చెట్లగుంపని యేకింవదంతి కలదు. ఆతింత్రిణీవనము సహస్రసంఖ్యాకవృక్షపరిశోభితంబై కన్పట్టుచుండుట నిజమునకీచింతతోఁపప్రయత్నసిద్ధముగఁ బెంపైనదియే కాని జనులువేసి పెంచినదిమాత్రము కాదు. మఱియుఁ గేతవరపుఁగొండ నొకభాగమున “ దున్నపోతులగండి ” యనువర్తమానమున వ్యవహరింపఁబడుచున్న కుఱవదారి యొకటికలదు. అది “ పూర్వము కొండమీఁదిగుడి కట్టుటకు మాతంగతుల్యములగు మహిషముల ద్వారమున పాషాణాదులఁ బైకిఁ జేర్చుటకేర్పఱచిన పథం ” బని పలుమంది చెప్పుకొందురు. కేతవరనామమే యీయగ్రహారము కోట కేతరాజుచే సృష్టింపఁబడినదనుటను స్థిరీకరించుచున్నది. అగ్రహారమిచ్చిన కేతరాజో వెంకటాద్రినాయుఁడో యెవరో యొకరీ కేతవరమున నప్పుడప్పుడువచ్చి నివసించుటకో లేక తమ

ప్రతినిధులే నివసించుటకో కాని కొన్ని రాజభవనములుకట్టించియుండిరి. కేవలము పాషాణమయములేవై మహోన్నతములగుకోటగోడలు వర్తమానమున శిథిలములై కానవచ్చుచున్నయవి. ఇప్పుడీకేతవరము నంగన్నపట్టిడియు నేకమండపములను గోటలను జూడ నేరాజుకాలముననో యిది మహోన్నతదశననుభవించియుండెననుట కించుకంతయు సంశయముండదు. వెంకటాద్రినాయఁడు రాజ్యమునకువచ్చునప్పటికీ దేవతాగ్రహారము జప్తులోనుండియుండ నాతఁడీప్రాంతమునకరుదెంచినపుడు తత్రత్యులా దరిద్రస్థితినివిన్నవించినఁ దదగ్రహార మాస్వామి కేవిధమైనయంతరాయమును లేకుండ జరుగునట్లు తగునేర్పాటులుచేసియుండెనఁట. నేఁటికిని స్వామియొక్క యర్చాసమయమునను చ్చరింపఁబడెడి వెంకటాద్రినాయనిగోత్రనామము లామహాపురుషునిచే నీదేవస్థానవిషయమై యిట్టిమహోపకారములు పెక్కు చేయఁబడియుండుటను స్పష్టీకరించుచున్నవి. అమరావతిశాసనమువలనఁ గోటకేతరాజు క్రీస్తుశ॥ 1182 వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడై షుమారు 50 సంవత్సరములు రాజ్యముచేసినట్లు తెలియుచున్నది. ఇఁక వెంకటాద్రినాయనిప్రభుత్వము క్రీ॥ శ॥ 17 వ శతాబ్దమందై యున్నది. కావున నేతన్నరసింహదేవాలయ మంతకుమున్నెప్పుడో నిర్మింపఁబడియుండ నిప్పటికిషుమారు 700 సంవత్సరములక్రిందఁ గేతరాజుచేతనే స్వామికీయగ్రహారమర్పింపఁబడి షుమారు 150 సంవత్సరములనాఁడు వెంకటాద్రినాయనిచేఁ బునరుద్ధారముచేయఁబడియుండవచ్చునని తోఁచెడిని. సద్యస్కాలమందీయగ్రహారము రు 1000 ల యాదాయమొత్తుచు నచ్చటియర్చకులగు శ్రీమాఁ తూమాటికేశవాచార్యులుగారి ధర్మకర్తృత్వముక్రింద నుండియున్నది. ఈ కేశవాచార్యులుగారును నేతదగ్రజులగు వెంకటాచార్యులుగారును నిజాముర జ్యమునకుసంబంధించి కృష్ణాతీరమందేయుండియున్న మట్టపల్లి

నృసింహక్షేత్రమునకును నీకేతవరనృసింహక్షేత్రమునకును ధర్మాధికారులై నిత్యనైవేద్యదీపారాధనకల్యాణోత్సవాదు లవిచ్ఛిన్నముగా సాగించుచుఁ జాలఁగీర్తిసంపాదించియున్నవారు. మట్టపల్లిలో యాత్రికులుసమర్పించెడికానుక లేతప్ప స్వామి కితరక్షేత్రపాత్రములుమరేమియు లేవు. అట్లైనను నన్వాహము స్వామిసందర్శనార్థమైవచ్చిపోవుచుండెడి యాత్రికులవలననే మిగులనాదాయమువచ్చుచుండును. ఇదియునుంగాక తత్సమీపపుఁ బెదవీడిదేశపాండ్యాలగు మహారాజశ్రీ రామారంగారావుగారేమి మఱికొందఱు దేశముఖుదేశపాండ్యాలేమి తత్స్వామి సేవాధురంధరులై తఱుచువచ్చుచుంబోవుచు నేవిధములైనలోపములును వాటిల్లకుండ నాత్మవిత్తార్పణపూర్వకంబుగం బరిశీలించుచుందురు. ధర్మకర్త లితరక్షేత్రములయందువలెఁగాక యాత్రికులనెల్లరం బుత్రవాత్సల్యమునఁజూచుచు బ్రాహ్మణులయెడ భక్తిశ్రద్ధలుగలిగి యన్నోదకములిచ్చిగౌరవించుచు సంతృప్తిపఱచుచుందురు. పెద్దయగువెంకటాచార్యులు 10-12 సంవత్సరములనుడి వైకుంఠధామం బలంకరించుచున్నవారు మాకృతిపతి కేతవరప్రాంతముల లైసెన్సుగుమాస్తాగానుండి కేతవరాగ్రహారమును ధర్మకర్తలవద్దనుండి యిజారాకుఁదీసికొని 10 సంవత్సరములపాటు స్వామికళ్యాణోత్సవాదులు తనయధికారముమీఁదనే జరుపుచుఁ దనభక్తిని శ్లాఘించుకొనియుండెను ఆయన కేతవరనరసింహస్వామిచరిత్రమే ప్రబంధముగా వ్రాయింపఁగడంగుటకదియే ముఖ్యకారణము. ఈపురుషుని పితృపితామహాదులు గుంటూరుతాలూకా ప్రత్తిపాట నివసించియుండిరి. ఈయనమాత్రము మాతామహస్థానమగు నరసరావుపేటతాలూకా యెద్దనపూడిగ్రామమునఁ బ్రభవించి యేకారణముననోవినుకొండతాలూకా కంభంపాటికివాస

డుమూర్చిన మేజరుమాంరోపోషవర్గములోఁ జేరిఁగి షామహా రికువది కేండ్లప్రాయమున వినుకొండ ఫారెస్టు రేంజరుగానున్న యొకసత్పురుషునాశ్రయించి యుద్యోగార్థకులై యాయనవెంటం దిరుగుచు నత్తైనప ల్లితాలూకా మన్నె సుల్తానుపాలెముం జేరి యక్కడనే తైసెన్సుగుమా స్తాగా నియమింపఁబడియెను. అప్పటి కామన్నె సుల్తానుపాలెమును గీర్తిశేషులగు మహారాజశ్రీ కాశిరాజు గోపాలకృష్ణయ్యగారు రెండవ కృష్ణావతారమన్నట్లలంకరించుచుండెను. ఆమహాపురుషుని నిరతాన్న పానమును సంతతబ్రాహ్మణసంతర్పణమును విద్వదభ్యాసమున్నాన మును శత్రుప్రతారణధీచాకచక్యమును నధికారివశీకరణంబును బంధు జనప్రీతియును నత్యంతౌదార్యంబును బ్రసంగౌచిత్యంబును బ్రియ వక్తృత్వమును వ్రాయుటకుఁ బ్రత్యేకచరిత్రగావలయునుగాని యిట్టిప్ర స్తావమునవో సాధ్యపడునదికాదు. ఆయనఘుని యన్నప్రదానప్రశం సాదివిషయమైన తాత్కాలికపు నా యీశ్లోకమొక్కటి యుదా హరించి విడిచెదను.

శ్లో॥ భూదేవ! త్వమిహాద్యకో లుఠసికిం? భుక్తశ్శమో జాయతే
కింభుక్తం? శమదాయకః ద్విజవరాపూపాజ్యదుగ్ధాదికం
కింకార్యం భవతీహాకస్యసదనే? గోపాలకృష్ణాలయే
దీర్ఘంసత్రమితిస్థిరామరజనా జల్పంతి లోకాః ప్రతి ॥

కొంతకాల మీ మాకృతిసేటి యాగోపాలకృష్ణయ్యగారియింటనే యుండి యాయనతోడిమిత్రత్వమున నుద్యోగకౌశలముకుదిరినకొలఁది ద్రవ్యార్జనదక్షుండై యచ్చటినమీపమున బోదనముశివారులోని యొకచిన్నపల్లెలో వాసమేర్పఱచికొనిచాలవఱకుభూమికూడనార్జించి సొంతవ్యవసాయముం జేయించుచుసంపన్నగృహస్థధర్మమునఁ గొంతకా

ల బాపట్లలోను కొంతకాలము బోధనమునను గాలముగడపి రెండు మూఁడుసంవత్సరములనుండి తత్సమీపస్థమేయగు మోర్జమపాటిలో నివాసము చేయుచున్నవాఁడు-అచ్చటఁగూడఁ బ్రసిద్ధులగు మ॥ తంగెడ రామకృష్ణయ్యగారు బహుకాలముక్రిందనిర్మింపించిన పార్వతీనీలకంఠస్వామియాలయమునుముందరఁ గల్యాణమంటపముంగట్టించి తనయౌదార్యము వెల్లడిపఱచుకొనెను. ఏదియోయొకవ్యయము వెదకుచుండుటయే యీయనసహజగుణమైయున్నది. అందుఁ బాత్రాపాత్రవివేచనమును నుచితానుచితజ్ఞత్వమును బ్రతిజ్ఞాతవచోనిర్వాహదీక్షయు మాత్ర మించుక తక్కువగుట వెఱ్ఱివానిచేతి రాయివలె "వద్దనున్నవాఁడే యదృష్టవంతుఁ" డన్నట్లుపరిణమించుచుండును. చేతిలోద్రవ్యమున్నప్పు డెంతయైనను వ్యయముచేయుటకు వెనుదీయువాఁడు కాఁడు. బాపట్లలో; ప్లీడరుగానుండి లక్షలకొలదిద్రవ్యమార్జించి కీర్తి శేషులైన బ్రహ్మాండం బాపయ్యగారి భార్య రాంబాయమ్మగారీయనకు మేనగోడలు-కొన్ని వత్సరములు డి. పి. డబ్లియు. సబ్ ఓవరుసీరుగానుండి వర్తమానమున జమీందారులవద్దసైతము ప్రైవేటుచేయుచు స్వతంత్రజీవనుండై కృష్ణాజిల్లా నందిగామతాలూకా కంభంపాడుగ్రామమున నివసించియున్న మ॥ శ్రీ॥ మంచిళ్ళనారాయణరావుగారీయనకు బావమఱఁది-గుంటూరులోఁ బేరుపొందినప్లీడరులును నిరతాన్నప్రదాతలును లోకోపకారులును నై కడుమంచిపద్ధతిం బ్రవర్తిల్లెడి మ॥ శ్రీ॥ ఏకా రామయ్యగారు లక్ష్మీనరసింహముగారు నీయనవంశ్యులు-కావున నిట్టిపూరుషునకుఁ గృతికన్యనిఁగలిగిన నా యానందము సూచించుచు నిఁక గ్రంథసారస్యముంగూర్చి యొకించుక ప్రశంసించి విరమించెద. ఒక్కటేపట్టుదల మీఁద వ్రాసినగ్రంథమందలి పాకముకూడ నొక్కటేరీతినుండును. అట్లు

కాక ప్రథమము ప్రబంధముగా రచించి యందలి మంచిమంచి పద్యముల న్నియును నాటకమునఁ జేర్చి యవశిష్టములును మరల నేవో తాత్కాలికముగ నిప్పుడుముడి వెట్టినవియును నైన పద్యగద్యములతోడ నే యెట్లో ప్రబంధప్రాయముం జేసి కృతిపతిని సంతసపెట్టఁజూచినందున నిది యంతరసవంతముగనుండునని చెప్పఁజాలను- సాధ్యమైనంతవఱకు జాగరూకతతోసంచరించినను ప్రమాదికమో యజ్ఞానకృతమో యై యేదే దోషముండవచ్చును గావున నట్టిసూక్ష్మదోషములఁ బ్రాజ్ఞులు మన్నింతురుగాక

ఇట్లు,

23-5-13 జా॥ పట్టాభిరామశాస్త్రి.

